# తొలిపలుకు

ఈకవి నాకు బూర్వపరిచితులు. వీరికవితను నాకు వినిపించిరి. మనశ్శతకము పూర్వశతక కవుల పద్ధతి ననుసరించి నడిచినది. 'మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః' యను నార్యోక్తిని బట్టి ఘనోపకార వికాసముల మార్గాలలో నుండు గూఢ రహస్యముల నింత చక్కగా విమర్శించి సాధారణ ప్రజానురంజకముగా బోధయగునట్లు వివరించుటయొక్క యుపు హాపము. ఇంతకు క్రితము 'అక్కచక్కడయను' ఖండకావ్యమునకు తొలిపలుకు వ్రాయునపుడు వీరికవనమును గురించి ప్రశంసించితిని. అప్పటికన్న నిప్పుడు వీరికవితలో నొకరకపు నైగనిగ్యముగలదని మాత్రము జెప్పెదను. ఈ కవి భావోద్రేక ప్రవాహము నిర్మలమై నిరంతరమై విరాజిల్లు ననుటకు నీ మనశ్శతకము ప్రబల తార్కాణము. సాంఘికముగా వీరి రచనలు మహోపకారములు. నీతి విజ్ఞానములకు సత్ప్రవర్తనకై వీరిగ్రంథములోని శీర్షికలకుండు విలువను విషయమే బయల్పరుచును. వేమనాది కవులవలె జాతీయ నైతిక సాంఘిక వైజ్ఞానిక సంస్కృతుల విరివిగా దానము చేయుటయందు వీరి ప్రతిభ యప్రతిమమని చెప్పుచు విరమించుచున్నాను.

ఇట్లు

వానమామలై లక్ష్మణాచార్యులు,
ఉపాధ్యాయుడు బాలికాపాఠశాల,
శ్రీరామపురము, కరీంనగర మండలము.

# మనవి

నేను నా బాల్యమున మరాఠీ భాష నభ్యసించిన వాడను. ఆంధ్ర భాషామతల్లి పరిచయ లోపము నన్ను నా ప్రౌఢవయాన బాధించుచుండెను. శ్రీ వానమామలై వరదాచార్యకవి. శ్రీ ఇమ్మడి రాజయ్యగారి ప్రోత్సాహముచే తెనుగు నభ్యసించనారంభించితిని. కృషి. జేసినచో తెనుగుతల్లి స్వల్ప కాలసిద్ధ కామధేనువగునని సిద్ధపరచుటకు కాలోలు నన్ను ప్రప్రథమ తార్కాణముగా కవిగా విశాలాంధ్ర రంగపాత్రను ప్రసాదించెను. మరాఠీ భాషా సుభాషిత సమానంబగు శ్రీసమర్థ రామదాస కృతదాస బోధామృతములోని "మనాచే శ్లోక్" । మనసా! వదిక నాదుమాట వినుమా! మర్యాద గాపాడుమా! యను శ్రీ తిరుపతి వెంకటకవియొక్క మత్తేభ పంచకము జూచియుంటిని. తెనుగులో స్వతంత్రముగా నీ "మనశ్శతకము" రచియించితిని. ఆంధ్ర భాషామతల్లిచే నీ మదల్ప సేవాకుసుమము స్వీకరింపబడుగాక! ఆంధ్ర ప్రజ నన్ను బాలకవిగా మరియు బాలాదపి సుభాషితం గ్రాహ్యమనునట్లు నన్నాదరింతురని విశ్వాసాతిరేకముగా నమ్మినాడ.

శ్రీ వానమామలై లక్ష్మణాచార్యులు మరియు శ్రీ ఇమ్మడి రాజయ్యగారు వాత్సల్యాతిశయముచే నీ గ్రంథము సమగ్రముగాఁ జూచి వలయు సాయముఁ జేసినందులకు వారి ఉభయులకు నా సహస్రవందన పుష్పాంజలి మంత్రకూటములోని సారస్వతాభిమాన ప్రజకు, నన్నిన్ని విధముల ఆదరించి సాయపడిన మహాశయులకు నా కృతజ్ఞతలు. ఇట్లు

"సే నా ప తి"

ఎన్. రామాచార్య ఉపాధ్యాయుడు

ఉన్నతపాఠశాల, మంత్రపురము (మంథెన)

# అభిప్రాయము

శ్రీ ఉదయరాజ శేషగిరిరావు ఎం.ఏ. రాజకవి చూడామణి,
సంస్కృతోపాధ్యాయుడు, ఉన్నతపాఠశాల, హనుమకొండ.

పుస్తకమను నీ గ్రంథము శ్రీసేనాపతి రామాచారి గారిచే విరచితము. గ్రంథము వరాహస్వామి కంకితము, ప్రపత్తిపరమగు శ్రీ ఆదిమ రామమూర్తి స్తుతికావింపబడినది. ఇది భక్తిరస కవితాప్రవాహము.

కవివందన మాచరించుటలో నొక కవి తరువాత వేరొక కవిని పేర్కొని వందన పురస్సర ప్రశంస ఒనరించక కవన రచనా ధోరణీ ప్రవాహయనియగు లేఖినికి వందన మర్పించుటలో నవ్యత స్ఫురించుచున్నది. వచనామృత కలశములను శీర్షికలోని భావము గంభీరముగా హృదయరంజకముగా విద్యోతమాన మగుచున్నది. ఇందలి మహత్తర నీతిదాయకాంశములు నేతృపావిత్ర్య సూచకముగా రాణించుచున్నది.

ఇత్యాద్యనేక శీర్షికామకుట ప్రకర విలసిత మీశతక రాజము; లోకానుభవ సూచన నైవహితోపదేశదాయక మీ గ్రంథ నాయకము కవనకందప సుమైకవనము, ఆధునిక వాఙ్మయనవ్యత్వ విలసిత మీశతకః భక్తి స్థాలీపులాక న్యాయముగా వీక్షించి, గ్రంథ విస్తారభీతిచే విరమించితిని. ధార రస వంతముగా నున్నది. ఏవంవిధ ధోరణి ఉద్భూతాపాదియని ప్రశంసించుచు బాలకవియగు నీ కవిశేఖరుడు ఇతోధిక రచనా నైపుణ్యము బడసాదించుటకు కృతిభర్తను శ్రీరామ చంద్రమూర్తికి నిత్యము సాంజలినై అభినందనములు అర్పించు చున్నాను.

ఇట్లు

(Sd.) శ్రీ. ఉ. శే. రావుగారు, రాజకవి చూడామణి.

# అభిప్రాయము

శ్రీ సేనాపతి రామాచార్యులుగారు వ్రాసిన "మనశ్శతకము" మున్నగు ఖండకృతులను చదివితిని. అవి నీతులతో కూడిన పద్యములు. భావములు బాగున్నవి. శైలికూడ బాగున్నది.

వీరి యుత్సాహము ప్రశంసనీయము. యువకులు భాషా సేవా కాంక్షగాఢముగా కలవారు. సర్వవిధముల ప్రోత్సాహమంద దగినవారు. వీరికవితారీతికి ధన్యవాదములు. వరిష్ఠులు కాన ఇతోధికాభివృద్ధిని కోరుచున్నాను.

ఇట్లు

ది. 27-2-53 (Sd.) శ్రీ సురవరపు ప్రతాపరెడ్డిగారు.
హైద్రాబాద్‌ద. B. A. B. L., M. L. A.

# అభిప్రాయము

SIROMANI
C. Rangacharyulu, Lecturer in Telugu & Sanskrit
Intermediate College,
Warangal, Kishanpura.
3—2—53.

శ్రీమాన్ సేనాపతి రామాచార్యులగారి తొలికృతియగు "అక్కడక్కడ" యనువిలక్షణ శీర్షికగల కావ్యమును జదివి

యూచించితిని. ఇప్పుడు వారు పంపిన మనశ్శతకమును జదివి మిక్కిలి సంతోషించితిని. ఈకవి రచనలో నూతన భావములు పెక్కుగనుపట్టును. మనస్సును సంబోధించుచు వ్రాసిన యీ మనశ్శతకము చక్కని నీతిని బోధించుచు సంఘమునకు ఉపాదేయముగానున్నది. ఉత్సాహియగు నీకవి ఇట్లే రచనాభ్యాసమును సాగించి ముందు ముందింకను రసవంతములగు కావ్యకుసుమములతో నాంధ్ర భారతిని౯ గైసేయుగాకయని యాశించుచున్నాను

ఇట్లు

(Sd ) చె. రంగాచార్యులు.

# అభిప్రాయము

ఇది ఈకవి రచించిన రెండవ గ్రంథము. ఇదివరకు "అక్కడక్కడ" చదివితిని. ఇప్పుడిత్తము నక్కడక్కడ చదివితిని. కొన్నికొన్ని పద్యములు మిక్కిలి హృదయంగమముగా నున్నవి. "నీమట్టుకు రాకుండ జూడుమా మానసమా" "యడుగిడుచుం గాలుజారెనని బొంకకుమా" యను మకుటముతో వ్రాసిన పద్యాలలోను మనసు ఏఏవికారములను తఱచుగా౯ బొందుచుండునో ప్రకటింపబడినది. కవి ప్రతిభాశాలియైన నిసర్గదేహము. నిగ్రహమింకను అవసరము. ఇతోఽధిక కవితాశక్తి కిది సాధనము.

ఇట్లు

(Sd) శ్రీ గార్లపాటి రాఘవరెడ్డిగారు, కవి,
హనుమకొండ, వరంగల్.

# అభిప్రాయము

కృషిక్షేత్రమునం "దక్కడక్కడ" తొలిమొలక ఎడ తెఱపి నీయని యుపాధ్యాయ వృత్తిలోగూడ ఎట్టెటులో సమయము దీసి మనశ్శతకమునుగూడ ప్రసవించియున్నారు. ఈ "ప్రసవము" తన సువాసనలచే సరసుల మనములు రంజింప జేయుచున్నది. రచనలలితమును, భావములు మృదులములును, అనుభవ సిద్ధములును అయి విరాజిల్లు చున్నవి.

ఇట్లు
(Sd.) శ్రీ వెంకటరాజన్న అవధాని
(మంత్ర కూటము) మంథెన.

# అభిప్రాయము

శ్రీగారిచే రచింపబడిన ద్వితీయగ్రంథమగు "మనశ్శతకము" నాద్యంతముగఁ జదివితిని. ఇందలి పద్యములు చాల వరకు సరళశైలిలో కందములందు వ్రాయబడి మృదుమధుర పద గుంభనముతో నొప్పుచున్నవి. ధారసరళముగా నున్నది. "ఆదర్శసేవ" 'కాలుజారెనని బొంకకుమా' మొదలగు గొన్ని శీర్షికల క్రింద వ్రాయబడిన పద్యములందలి భావములు మానవుని నిత్యజీవితమున కాదర్శ ప్రాయము లనదగి నీతిబోధకములై, అమూల్యములై యలరారుచున్నవి. సంఘసంస్కరణ యందు వీరికిగల శ్రద్ధను బ్రకటించుచున్నవి. వీరి కవిత్వము "అనగ నసగ రాగమతిశయిల్లుచునుండు" నన్నట్లు దైనం దినాభివృద్ధిగాంచుచున్నది.

ఇట్లు
(Sd.) ఇమ్మడి రాజయ్య.
DY. Inspector of Schools, Chennoor.

# అభిప్రాయము

శ్రీ వారి మనశ్శతకము నామూలమున చదివి చూచితిని. బాగుగనేయున్నది. పద్యములలోని విషయము చాల సామాన్యముగ నున్నది. ఇందలి 120 పద్యములు ఏదైన యొక కథకై యుపయోగింపబడినచో నదియొక చిన్న కావ్యముగాను జెడిడి. అట్లుకాక నీతిపద్యముల రూపమున నున్నందున ఎక్కువ ఆకర్షితముగా లేదు. అయినను శైలి బాగుగనే యున్నది. మొత్తము మీద యీపుస్తకము చిన్నశతకముగా నుండగలదు.

ది. 2-?-1953

ఇట్లు

(Sd.) శ్రీ మాటపాటి హనుమంతురావుగారు



శ్రీరస్తు

---

# ఆదివరాహమూర్తిస్తుతి

ఉ॥ ఆదరణీయజానపద ♦ మైనకమాన్పురభాగ్యభూమికం
బాదుగజేసియేకశిల ♦ పైనపవిత్రతరంబులైననీ
పాదసరోరుహప్రచుర ♦ భారముమోపినిజస్వరూపరే
ఖామలతోవిరాజిలిన ♦ ఆదివరాహమ! నీకుమ్రొక్కెదన్॥

చ॥ అలరొకనాడు నీవసవి ♦ హారముకై చనుదెంచినట్టినిన్
వలగొని ఈకమాన్పురప్ర ♦ భక్తులపూర్వపురస్కృతిన్నినున్
పిలిచిననిల్చిపోయినను ♦ నీకయి యయ్యది పుణ్యలోకవా
సులుభయభక్తితో నెదుట ♦ జూతురొ! ఆదివరాహనాయకా!

చ॥ గుడియును లేదునీకొజహ ♦ గోపురమేసియు లేదు! వానలో
దడియుచునుండనీకొకవ ♦ తంబయె నల్లనియొండలోనిలం
బడినతపస్వి? యౌనవును! ♦ భక్తులకై కడగండ్లనోర్వని
క్రీడవిలసిల్లినావు మమ ♦ కారముచేత వరాహవిగ్రహా!

# కులదేవతాస్మరణ

క॥ శ్రీరామనామమహిమా
ధారకమునగండశిలల పంక్తులుమున్నా
వారిధియందు మునుగని యవ
తార కథలు సర్వదైవతత్వంబగుటన్

క॥ మునివందిత రఘుపతిరా
మున కేయావత్తుధార బోసికొనిన నీ
కనుమానము భవసాగర
మన నీకొక లెక్కలోనిదా ఓమనసా! 1

క॥ వరమొసగెడి నీకోరిక
కొఱకై వరమొకటినేను గోరెద నాకై
వరమడిగెడి పేరాసను
దరికిక రానీయవలదు తగదది నాకున్। 2

క॥ వరమడుగుకొనదగినవా
క్కొరకై విశేషములను కోరకనునిట విశ్వం
భరనామధేయ! నిన్నా
వరమా యడుగుటయు! లేక పరిహాసకమా! 3

# కవివందనము

క॥ బంగారపు కలమున వ్రా
యంగను ఘటనలను జేయునట్టి కళాపా
రంగతులగు కవితావ్యా
సంగులనే మ్రొక్కువాఁడ సాష్టాంగముగన్ 1

క॥ పుక్కిటి పౌరాణికమును
నిక్కపు కథలోయనంగ నిలిపిన కవితా
ఫక్కులకై కవికలముకు
మ్రొక్కెదఁ జేమోడ్చి నేను బుట్టెనుభక్తిన్ 2

క॥ ఒక్కకథను జెప్పెదనని
చక్కగ వినుమంచు వేల సంగ్రహ కథలన్
లెక్కించి చెప్పుచుండెడి
ఫక్కిఁగొనిన కవికలంబు వందనమిదిగో! 3

క॥ భవసాగరమున జడమా
నవతరణోపాయమునకు నౌకాసమభా
గవతములఁ బ్రసాదించిన
కవి కలమును మ్రొక్కవలయుఁ గాదే మనసా! 4

క॥ సుందరతర నీతిని నద
దుందుభియై సుమతికొఱకుఁ దోడుపడిన నో
ఛందోబద్ధక్షేత్రపు
కందమ! ననుఁ గూడఁ గొంతఁ గరుణించవలెన్ 5

# నయనామృత కలశములు

క॥ లలిత సుశాస్వత కాంతా
తిలకమును స్వీయ మాతృదేశ ధనముగాఁ
గిలకించెడి నయనయుగళి
కలశములు సుధా నిధాన కంధులనఁబడుఁగా. 1

క॥ కులదీపక గృహలక్ష్మి
తిలకమును స్వీకీదు గేహ దేవతయని ని
శ్చలతం గను నట్టినయన
కలశములు సుధానిధాన కంధులనఁబడుఁగా. 2

క॥ కలకాలము కష్టార్జిత
ఫలితముగా వట్టిజావపై సంతృప్తిం
గలిగించు కొనిన లోచన
కలశములు సుధానిధాన కంధులనఁబడుఁగా. 3

క॥ జలభ్రమ జనస్వయంకృషి
సలిపిన హాలికుఁడు సంత సంబున నాశా
ఫలమునుఁ గను నేత్రద్వయ
కలశముల సుధాసమృద్ధి గాఁగను 'గానుమా'! 4

క॥ పలుఁబేదల క్షేమమునకు
బలిదానముఁ జేయవలసి వచ్చిన యెడలన్
జలికని మొనగాని నయన
కలశముల సుధాసమృద్ధి గాఁగను 'గానుమా!'

క॥ బలవంతు డగుచుఁ జిన్నలఁ
గలనైనం గీడుఁ జేయఁ గనని జాలిం
బలుకునో? యనఁ జూచినదృ
క్కలశముల సుధాసమృద్ధి గాఁగను 'గొనుమా!' 6

క॥ పాత్రోచిత సారస్వత
గోత్రికులై సేవకై యకుంఠిత కవితా
యాత్రిక కవిచంద్రుని దృక్
పాత్రలు మధురామృత ప్రవాహము ఝచషకా. 7

క॥ కలియుగమునన్నైన నుభయ
కులరక్షకులైన లేత గోమరాంధ్రను ని
ష్కలుషాత్మంగనెడి నయన
కలశములు సుధాసమృద్ధి గాఁజనుమనసా. 8

## " నీమట్టుకు రాకుండఁ జూడుమా! మానసమా "

క॥ పట్టనడుమ వచ్చినసిరి
కుట్టిపడుచు లేనిపోని యుత్పాతములన్
నిట్టాడిన వారలునీ
మట్టుకు రాకుండఁ జూడుమా! మానసమా! 1

క॥ పట్టపగలు మాలల నిది
ముట్టకుఁ డది ముట్టవలదు పోపొండనుచుం
దిట్టెడి దుర్బుద్ధిని నీ
మట్టుకు రాకుండఁ జూడుమా! మానసమా! 2

క॥ చుట్టాలయి యొకరి కొకరి
జుట్టున్ ముడిఁబెట్టు సభ్య చోరలునిన్నున్
బట్ట తలం జేయన్నీ
మట్టుకు రాకుండఁ జూడుమా! మానసమా! 3

క॥ చట్టమ్ముల నొక్కొక్కటి
బుట్టం బడవేసి యుదర పోషణకై రాఁ
బట్టిన సిరిసంపద మన
మట్టుకు రాకున్న బ్రతుకమా! మానసమా! 4

దే॥ గట్టిగ నేదే నొకతెగ
బొట్టులనెక్కించి వాని మూలమ్మున రాఁ
బట్టినధనధాన్యము మన
మట్టుకు రాకున్న బ్రతుకమా! మానసమా! 5

క॥ వట్టి యమాయికపు జనులఁ
బిట్టల నురిఁ బోసినట్లు బీడించుచు రాఁ
బట్టిన పది డబ్బులు మన
మట్టుకు రాకున్న బ్రతుకమా! మానసమా! 6

క॥ కొట్టాలను గడుదూరముఁ
గట్టెడు చందాన దుష్టకార్యములను రాఁ
బట్టిన దుర్బుద్ధిని నీ
మట్టుకు రాకుండఁ జూడుమా! మానసమా! 7

క॥ పుట్టెడు కోపానఁ గవులఁ
దిట్టకు బహుభావకోటిఁ దెలియక పెల్లం
బెట్టకుమా! యిదియున్నీ
మట్టుకుఁ జెప్పితిని వినుమ మమమానసమా! 8

క॥ ఒట్టుసుమీ నీతోడని
పట్టపగలబద్ధమాడి పాపముఁగూడం
బెట్టకుమా యిదియున్నీ
మట్టుకుఁ జెప్పితిని వినుమ! మమమానసమా! 9

క॥ చుట్టాలను పక్కాలను
నట్టేటం బుట్టిముంచునట్టి తెలివి రాఁ
బట్టకుమా యిదియున్నీ
మట్టుకుఁ జెప్పితిని వినుమ మమమానసమా! 10

క॥ పట్టువలం గొట్టువడని
దిట్టల హృద్భావనానిధిన్ లోతుఁజూ
పెట్టఁగలవ గానకవుల
మట్టుకు నిదమిత్థమనకుమా! మానసమా! 11

# కాలుజారెనని బొంకకుమా!

క॥ మిడిమేలపు వారాంగన
పొడకుం బొరపాటుకేనిఁ బోవలదనిసం
బెడచెవినఁ బెట్టి యుంకకు
నడుగిడుచుం గాలు జారెనని బొంకకుమా! 1

క॥ పొడవయిన జడలుఁ గలిగిన
పడుచుల వలలోని జారపక్షియనఁ జేరం
బడిమిడుకుటకో మనసా!
యడుగిడుచుం గాలుఁ జారెనని బొంకకుమా! 2

క॥ కడపన్ శిల్పంబన నిల-
బడిన పడుచుదానిచేతి పక్షియన నురిం
బడి పిదపఁ గొట్టుకొనుటకు
నడుగిడుచుం జాడఁ జారెనని బొంకకుమా! 3

క॥ జడమతి వనభోగినిచే
ముడిఁ గొనఁబడి కొలఁది కాలమునకుఁ గ్రమముగా
బొతబోడలుఁ జేయఁబడుటకు
నడుగిడుచున్ భ్రమసిపోతి నని బొంకకుమా! 4

క॥ తడఁబడని ధనికులునుఁ జే
పడిరని నటనాతిరేక వాక్చతురతచేఁ
బొడిఁ గొట్టబడి వేశ్యకడకు
నడుగిడుచున్ మోసపోతినని బొంకకుమా! 5

# ఆదర్శసేవ

క॥ ఘన మహాన వ్రతమున శ్రీ
వనలక్షణ సస్యరాజ్య వైభవమగుచుం
దనువెల్ల ధారఁబోసెడి
ఘనత మహాత్ములకునై నగలదే! మనసా! 1

క॥ వనమై జీవులకున్ జీ
వనమై యెటుఁ జూచినం బ్రవాహంబై పా
రిన యట్టి నదీ నదములఁ
గనుమా! ఆదర్శ సేవకై మానసమా! 2

క॥ ఇనుఁడై సాతాన్నారా
యణుఁడై గోళముల కెల్లనాకర్షకుఁడై
చనునట్టి నిలువు కొలువునుఁ
గనుమా ఆదర్శసేవకై మానసమా! 3

క॥ జననీసమ నవభారత
జనపద సీమాప్రదేశ సంరక్షణకై
తనువోడ్చిచను మహాత్ములఁ
గనుమా! ఆదర్శసేవకై మానసమా! 4

క॥ ఘనమనఁబడుచున్ దివ్యాం
గణమందు విహారియైన కాలమున ఘనా
ఘనమైన రహస్యంబునుఁ
గనుమా! ఆదర్శసేవకై మానసమా! 5

క॥ వనవాస దీక్షనుండియు
జనశోక నివారణార్థ సామర్థ్యమునం
దనువెల్ల ధారబోసిన
ఘనత వనస్పతికిఁ దప్పఁగలదే! మనసా! 6

క॥ మునినై వ్యాసుండై తా
ననుపమయోగీంద్రుఁడై యనంతకథా సే
చనమునుఁ జేసిన కొలువును
గనుమా! ఆదర్శసేవకై మానసమా! 7

క॥ ఘనుఁడై శ్రీమన్నారా
యణుఁడై లోకాభి రాముఁడై యవతారం
బనివచ్చిన కారణమునుఁ
గనుమా! ఆదర్శసేవకై మానసమా! 8

క॥ తెనుఁగున హాలికుఁడగు పో
తన శక్తి కొలంది తెలుఁగు తల్లిని సంభా
వనఁజేసిన యింగితమునుఁ
గనుమా! నిస్స్వార్థ సేవకై మానసమా! 9

# తేట మాట

క॥ పాటవముల కొలఁది మీకో
చ్చాటనమునకున్ సరైన సదుపాయములం
బాటించి తెలిపి తేటల
మాటల కలవడుదువా! సమంజస బుద్ధిన్. 1

క॥ చాటునకు నొక తెఱఁగున
నేటునకు మఱొక్కతీరు నెగ్గించెడివో
మోటమికై పెన్నిధియగు
మాటల కలవడకుమా! సమంజస బుద్ధిన్; 2

క॥ ఆటోపాటో యనఁబ్రియకై
పోటి పరీక్షన్ జయాంకములఁ బొందుటకున్
నూటికి నూరుండెచ్చెడి
మాటల కలవడుదువా! సమంజస బుద్ధిన్. 3

క॥ ఆటవిని సీతకై యొక
గీటేర్పడినట్లు నోటికిన్ వాక్ప్రమున్
సీటోయన మిటిమిటాజని
మాటల కలవడుదువా! సమంజస బుద్ధిన్. 4

క॥ తేట తెనుఁగు సింగారపు
మాటల ముడివిప్పి భావపూర్ణాంకమునన్
జాటువులను నెగఁజిమ్మెడి
మాటల కలవడుదువా! సమంజస బుద్ధిన్. 5

# బంగారపు నడక

క॥ నడియాడున సైతంబే
పెడబాటునఁ బోక దివ్య వీధులలో వాఁ
డడుగిడె నన బలుచక్కని
నడకన్ బ్రతివానికిం గనంబడ జనుమా! 1

క॥ ఎడతెగని లాలసలకై
గడియ గడియ కన్నిచోట్లఁ గాటకము గనం
బడఁగాన తూకమాడిన
నడకన్ బ్రతివానికిం గనంబడఁ జనుమా! 2

క॥ కడగండ్లకు నెదురీదిన
నడలం దడవడక జయ నినాదముతో నీ
వడుగిడుమా! యెటు దొణకని
నడకన్ బ్రతివానికిం గనంబడఁ జనుమా! 3

క॥ చెడఁగొట్టఁ బడక నీవుం
జెడఁగొట్టక రాజయుక్తి చేసంతట నీ
వడుగిడుమా! బంగారపు
నడకన నిదియే యనం గనంబడఁ జనుమా! 4

క॥ కడలిం బయనంబగుతరి
పడవను బ్రతిసారి నే తుపానునకున్ లోఁ
బడనట్లుఁ జూచుచుండెడి
నడకన్ లౌకికమునం గనంబడఁ జనుమా! ౫

# సేవాఫలితార్థము

క॥ చెలువలకై చింపులపే
గులు వలదని సన్నవన్నె క్రొంగ్రొత్తవి కో
కలనందఁ జేయుసేవా
ఫలితార్థముఁ దెలిసికొనెదవా! మన్మనమా! 1

క॥ చలిపులికాలములోఁ గుల
కులఁ గూసెడి బీదవారి కొఱకెండిన పు
డ్కల నందఁజేయుసేవా
ఫలితార్థముఁ దెలిసికొనెదవా! మానసమా! 2

క॥ జలదములన సురుచిరమగు
ఫలరసమును నడుగలేని పక్షులకై కుం
డలకొలఁది ధారఁబోసిన
ఫలితార్థముఁ దెలిసికొనెదవా! మానసమా! 3

క॥ కలకాలముఁ బలుగుడిసెలు
గలవారల కొఱకుగడ్డిగాదములై బీ
దలయింటి కొప్పులై చను
ఫలితార్థము నీకుఁ దెలియవలదే! మనసా! 4

క॥ పలుచని చెట్లై గుంపుగ
నిలఁబడి మేఘముల నిలిపి నియమమునం గా
ల్వలుబాఱఁ జేయుసేవా
ఫలితార్థము నీకుఁ దెలియవలదే! మనసా! 5

క॥ జలదములను మనకై యా
కలిదప్పియుఁ దీఁజనానకట్టగు చుం గా
ల్వలు బాఱఁజేయుసేవా
ఫలితార్థముఁ దెలిసికొనెదవా! ఓమనసా! 6



# కించిదృణముక్తి

క॥ నినుఁగనిన మహాత్ముఁడగు
జనకునికై నీవు సత్ప్రసంతాన సమ
ర్పణ మార్గమూలమున నీ
ఋణమునుఁ జెల్లించుకొనెదవే! మానసమా! 1

క॥ పినవాఁడు మాటలనుఁ గనుఁ
గొనఁ జేసిన తెనుఁగు తల్లికొఱకై సేవా
ధనము నొసంగుచు నీవా
ఋణముక్తి విశేష వైఖరిం గనుఁగొనుమా! 2

క॥ నినుఁజూచి వీఁడు మనవాఁ
డని యనుకొని చేరఁదీయునట్టి గురుమహా
జనులంగని చేమోడ్చుచు
ఋణమును జెల్లించుకొనెదవే! మానసమా! 3

క॥ నినుఁగనిన దేవతనుఁగని
వినయముఁ జూపెట్టునట్టి విధికై స్త్రీ జా
తిని గౌరవించి కొద్దిగ
ఋణమును జెల్లించుకొనెదవే! మానసమా! 4

క॥ మన మాతృ దేశ సంర
క్షణకై కీర్తి ప్రతిష్ఠకై యందఱితో
మునుముందుఁ బోయి జన నీ
ఋణముక్తికి దారిఁదీయవే! మానసమా! 5

# "వారికి నీవోలె మనసు వలదే! మనసా!"

క॥ ఆరంభ శూరులై గం
భీరాలాపములఁ బూని వికసాకమూఁ గ
జారిన మగవారగు దొర
గారికి నీవంటి మనసుగలదే! మనసా! 1

క॥ పౌరుషము లేకచచ్చిన
తీరున బిచ్చమునకంచుఁ దిరిగిన వారిన్
నోరెత్తి కఱవఁబోయిన
వారికి నీవంటి మనసువలదే! మనసా! 2

క॥ పేరూరున నబలాపరి
వారమునకుఁ జెందినట్టి భార్యపయిననే
పౌరుషము వెళ్ళఁగ్రక్కెడి
వారికి నీవంటి మనసు! వలదే! మనసా! 3

క॥ భారత హితకరసువ్రత
పారీణులనైనఁ దుచ్ఛభావనచే ధి
క్కారముగా లెక్కించెడి
వారికి హృదయంబులేని వగపా! మనసా! 4

క॥ గోరంత తప్పునైనను
నోరంతయు నొచ్చునట్టు నుడువుటకున్ వే
సారక ప్రతిపాదించిన
వారలకున్ శూన్యహృదయ బాధయె! మనసా! 5

చ॥ నారీకులమునకందిన
వారలకుఁ బురదఁ బూయవలెనని యెంతో
నూరించి బోర్ల వేసిన
వారికి నీవంటి మనసువలదే! మనసా! 6

క॥ నోరెత్తి జవాబిచ్చిన
వారలుగానట్టి బీదవారల నొక పా
లేరోయనఁ దిట్టిన మగ
వారికి మనసేని యుండవచ్చున! మనసా! 7

# కావలదే

క॥ గెలిచినచోఁ బెద్దఱికము
గెలువనిచోఁ జిన్నబోయి ఖిన్నుఁడగుట నా
వలెకేశాకేశియును
కలుగవలెన? నీకు రిక్త గౌరవమునకున్ 1

క॥ కలిమిన్ దేహాశ్రిలను
ఒలిపించి దరిద్రులైన వారిని, యుక్తిం
దలఁగొఱిగి పంపుటకుఁ గా
వలెనే! స్వార్థ ప్రపంచ వైభవమునకున్, 2

క॥ పలుకుఁ బడిం బొడవగు మా
టలచేఁ గోటలనుగట్టి టక్కరులై బీ
దల నెత్తిఁగొట్టునది గా
వలెనే! భాషా ప్రపంచ వైభవమునకున్. 3

క॥ కులమునఁ బెద్దలమై సం
దులకుం జిన్నలకు వారితోడగుచున్ బీ
దలఁ జేరఁదీయునది గా
వలదే! పలులేలఁ జెప్పవలెనే మనసా! 4

క॥ జలనిధి పరిమితిలో నొక
జలకణ మన నీవనంత సంసారసద
స్యులలో నొకఁడని యనుకొన
వలదే! చెవిపిండి చెప్పవలెనే! మనసా! 5

# " మ న సా! "

క॥ ధనికుల దుర్వ్యర్తనమునుఁ
గనవా! లోకమున ధనమె ఘనమా! వేశ్యాం
గనచే నార్జింపఁబడిన
ధనము యదార్థ ప్రకార ధనమా! మనమా! 1

క॥ మనసా! నీవేని మనో
ధనమనఁబడు కారణమున తద్వ ద్దుర్వ
ర్తన మున్నీ లోనంతటఁ
గనఁబడినన్ సత్యమౌన! కాదా! మనసా! 2

క॥ మనసా! బహు ధన సంపా
దనమే కర్తవ్యమా! యదార్థ క్రమ సా
ధనమునఁ జిరకాల యశో
ధనమే కావలసినట్టి ధనమగు కాదా! 3

క॥ మన యిరువురికిం గించి
ద్ధన లోపము చిన్నతనమ? తాత్త్విక దృష్టిం
గనలేవా! యీకృతిని
ధనమే యప్రాప్యమైన ధనమా! మనమా! 4

క॥ ముని సంపదయగు కవితా
ధనమునుఁ గైకొనిన మనస! ధనలోపము నీ
కనుకూల శత్రువై నీ
యనవరత కృషిన్ మహా సహాయ నిధియయ్యెన్. 5

క॥ "ననుమించిన వాఁడే లే
డని" యనుకొని శృంగభంగమైన పిదప నిం
కను పునరావృత్తికి నో
మనసా! యడుగిడకుమా! యమాయికపు మతిన్. 6

క॥ కనులకు లుబ్ధాగ్రేసర
ధనికుఁడు గనఁబడినయట్లు తద్వత్తు వీఁడో
శనియని పిలువఁబడుటకుఁ
జనెదవ! శాశ్వతమ! అష్టసంపదలైనన్. 7

క॥ అనుపమ సుందరనైతిక
ధనమును జేకొనిన మనస! ద్రవ్యాభావం
బున జీవకోటి మునుగున?
మనమా! నిర్ధనులమైన మనమా! మనమా! 8

క॥ ధనము మన కతిథియై వ
చ్చినతోడనె చేతులార నెగవేయుచు దు
ర్వినియోగ పఱచు మనసా!
ధనమా! తొంగేనిఁ జూడఁ దలఁచుమ! మనమా! 9

## "మాటలకురిబోసి కొనకుమా! మానసమా!"

క॥ గోటం బోయెడి తప్పనుఁ
దీటన్ గొడ్డండ్లచేతఁ దీర్చిన సరణిం
బాటించి తగవులాడిన
మాటల కురిఁబోసి కొనకుమా! మానసమా! 1

క॥ ఆటలనైనను మాటనుఁ
బాటించక తోటియాడు వారలతోఁ బో
రాటమునకు వెనుదీయని
మాటల కురిఁబోసి కొనకుమా! మానసమా! 2

క॥ కూటికి గుడ్డకు నేవో
పోటీలనుఁ ద్రవ్వి, లేనిపోని తగవులం
బాటించి గెలచి వచ్చిన
మాటల కురిఁబోసి కొనకుమా! మానసమా! 3

క॥ ఏటేట బూటకపు పెడ
బాటలచే కౌరవాది పాపగతులకున్
సూటిగఁ దోడ్కొని పోఁగల
మాటల కురిఁబోసి కొనకుమా! ఓమనసా! 4

క॥ బూటకముల కన్నింటికిఁ
గూటస్థ ప్రాయమగుచుఁ గోట్లకొలందిన్
నాటకముల నాడించెడి
మాటల కురిఁబోసి కొనకుమా! మానసమా! 5

క॥ నేటునఁ గనఁబడక తెరల
చాటునఁ బడియుండునట్టి సంసారుల మో
మోటమిచే మురిపించెడి
మాటల కురిఁబోసి కొనకుమా! ఓమనసా! 6

క॥ చీటికి మాటికి కబద్ధపు
మాటల కలవడుచు నరక మకరాలయ మీ
నోటన్ నిధి జేసికొనిన
మాటల కురిఁబోసి కొనకుమా! మానసమా! 7

క॥ మాటాడ లేకపోయిన
చాటునఁ బశుపక్షులేని సలిపినమాటం
బాటించక పోయిన పార
పాటునఁ జనినట్లుఁ జూతువా! మానసమా! 8

క॥ నోటికిఁ దాళాలొత్తిన
సాటిన్ మౌనమునఁ బ్రకృతి జాలమ్ము నిరా
ఘాటముగా జన సేవం
బాటించద! యద్దువడెన? వాగ్లోపమునన్, 9

క॥ అదియిదియని వేసారక
ముదిమినిఁ దప్పిన తెరుంగు మూర్ఖాలా పా
స్పదమునకు రాజువోయన
వదరకుమా! సర్వశుష్క వాదముఖమునన్, 10

# వదనామృతకలశము

క॥ నలువైపుల కష్టస్థితి
చెలరేగినఁగాని చింతసేయక యెంతో
కిలకిల నవ్వుహాస్యవదన
కలశములు సుధావిదారకములే! మనసా! 1

క॥ జిలిబిలి పలుకులకిదియే
నిలకడనన్ సర్వమాన్య నీతినిధియనం
బలికిన స్మిత హాస్యవదన
కలశములు సుధావిదారకములో! మనసా! 2

క॥ అలరారునట్టి మాటల
బలిమిం బ్రతిపక్షినైన భళిరే భళియనం
దలలూపఁ జేయువాఙ్ముఖ
కలశములు సుధావిదారకములో! మనసా! 3

క॥ సలిల సమానార్ధక ని
ర్మల హృదయాళుండు మానమర్యాదలతోఁ
బలికిన మృదుతర. వాఙ్ముఖ
కలశములు సుధావిదారకములో! మనసా! 4

క॥ పలుకుటకును నేదోయొక
కొలతం దూకమున స్పష్టగోష్ఠికిఁ జెలమన్
జలయున మాటాడిన ముఖ
కలశములు సుధావిదారకములో! మనసా! 5

క॥ లలితకళలం దేం గలిగిన
కలమునం జేకొనుచు దివ్యకవితా సృష్టిన్
నిలిపిన కవిరాజుల ముఖ
కంళములు సుధాసమృద్ధిగాం గనుగొనుమా! 6

# చాలు

క॥ వీలున్న యెడల నందఱి
మేలుకొఱకుఁ జెమట వడుపు మిత్రుఁడవని నీ
శీలముఁ గొనియాడఁ బడిన
జాలద! చిరకాలకీర్తి చాలద! మనసా! 1

క॥ కాల క్రమమునకుం బ్రతి
కూలముగా నడుతువేల! కొందఱిచేనో
వ్రేలెత్తి జూపఁబడెదవ?
చాలద! యపకీర్తి నీకుఁ జాలద! మనసా! 2

క॥ కాల పరంపరలకునను
కూలముగా నడుచునట్టి గుణములకై స
చ్ఛీలుడఁవని పొగడఁ బడినఁ
జాలద! బహుమానధనము చాలద! మనసా! 3

క॥ మాలో మాకే యెయ్యది
చీలిక లేకుండఁ జేయఁ జేఁదోడగునిన్
సేలుసెబాసని మెచ్చినఁ
జాలద! కీర్తి ప్రతిష్ఠ చాలద! మనసా! 4

క॥ హాలా హాలనామ విష
జ్వాలలచే బాధపడిన సాంబశివున కం
జాలిన శ్రీరామజపము
చాలునదో కల్పవృక్ష సమమో! మనసా! 5

క॥ కాలోచిత సేవావ్రత
లాలసులన్ వ్రేలుజూపి లౌకిక భాషా
మూలమునఁ దిట్టకుండినఁ
జాలద! ఉత్సాహ పఱచఁ జాలని యెడలన్, ౬

క॥ పాపాలనుఁ జేసిన నీ
పాపమునకు "అంతరాత్మభాగీరథి" లో
పాపక్షాళక పశ్చా
త్తాప స్నానంబు చాలదా! మానసమా! 7

క॥ ఉపకారికిఁ గించిత్ప్ర
త్యుపకారముఁ జేయలేక యుండినచో నీ
వపకారముఁ జేయని యెడ
యుపకారముఁ జేసినన్ మహా పకృతియగున్ 8

క॥ తీరికలో ఘోర దురా
చారవిచార ప్రవాహ సన్నాహము నిన్
కౌరవ రంగాంతర సం
చారముఁ జేయించరాదు చాలిక! మనసా! 9

# "కొసరు పద్దియములు (సంకీర్ణము)"

క॥ పరసారస్వత యాత్రాం
తరమున నీ తేట తెనుఁగు తల్లికి నెంతో
మురిసెడి చక్కని దరగల
సరకును దిగుమతిగఁ జేయఁ జనుమా! మనసా! 1

క॥ కరవాలముఁ జేతంగొని
దురద కొఱకు గోకుకొనుటఁ దోఁచినరీతిం
బొరపాటునకును గురుజన
పరిహాసముఁ జేయఁబోవ వలదో! మనసా! 2

క॥ దురిత విచారక్రమమిగా
వఱకుఁ దుఃఖానోయసంగ వచ్చినచో నీ
స్థిర శాంత మనోనాకం
దరుమఁ గలవుగాన జాగ్రతంగను మనసా! 3

క॥ కొరగాని విచారపరం
పరలకు నాహ్వాన మిచ్చి ప్రశ్నోత్తర సం
కరమున నునుకనుదంచిన
సరణి నొకతమాషఁ జూపఁ జనెదవ! మనసా! 4

క॥ పొరపాటున జరిగినయొక
పొరపాటున కెంతొ యేదొ మునిఁగె ననుచుఁదొం
దరబాటున నీవారినిఁ
గఱచిన చందానఁ దగువుకై వెడలెదవా! 5

క॥ జరుగం బడునదితప్పక
జరుగును గాఁబట్టివ్యర్థ సంతాప సరో
వరమున మునుకలు వేసిన
సరణి జెరికి వానివోలెఁ జనెదవ! మనసా! 6

క॥ ప్రీతి మాటకుఁ దివ్యసుధా
పీతమని, నిష్ఫలితముగ వచించుట కంటెం
హితుల మగుచు మనమే స
మ్మతి మనమునఁ జెప్పుకొనెదమా! మానసమా! 7

క॥ నీవట చంచలమతివట
కావున భయపడుదుగాని కలకాలము నే
నీపాడను గాన శుభ
స్థానరతమై యుందు వంచుఁ దలతును! మనసా! 8

క॥ మనసా! నాలోన నినుం
గనలేక పరాయినోటఁ గనుచాటున నీ
గుణదోష విమర్శా ద
ర్శనమున నిను జూడ నాకు శక్యంబయ్యెన్. 9

క॥ గొప్ప తెలివిఁ దేట పఱచి
తప్పన్నేఁ జేయనసెడి దాంభికునకు నో
చెప్పోయన నదియె మొదటి
తప్పై తప్పున్నదై ప్రథమమున నిలచెన్. 10

క॥ పొగపాటున నైనన్నే
మరవననెడివాడు మందమతియన స్వీయ
స్మరణ పరిమితినిఁ బాపము
మరచెను తానె స్వయం ప్రమాదమిదమనన్. 11

క॥ పేరాసకుఁ బెత్తనమును
గోరినచో రాదుకాని గోరకయున్నన్
ధీరోదాత్త మహాత్మునిఁ
జేరుఁ బ్రపంచ ప్రసిద్ధ చిత్రమిదియనన్. 12

క॥ గురుజన వాక్యములవు నీ
శిరము నిజముగా సజీవ సింహాసనమై
వరలినచో వలదనినను
సిరియున్ సంపదయు నిన్ను జేందు! మనసా! 13

—: స మా ప్త ము. :—

## సవరణ

పుట. 1. పద్యము 2. పంక్తి 3. లో 'పిలిచిన' అను దానికి బదులుగా "నిలిపిన" అని సవరించుకొనవలెను.

పుట 2. పద్యము 2. పంక్తి 3. లో "కనుమానము" అనుదానికి బదులుగా "కనుమానము?" అని దిద్దుకొనవనులె

## మంథని పురములోని ధనసహాయకులు.

1. శ్రీ గోవిందాచార్యులుగారు, ఉ॥ పా॥ ప్రధానోపాధ్యాయులు
2. శ్రీ జమీలుద్దీన్ అహమ్మద్ గారు, తహసీలుదారు
3. శ్రీ కె.వి. జనార్దనరావుగారు, డాక్టరు
4. శ్రీ ఎం. రాజేశ్వరరావుగారు, వకీలు
5. శ్రీ పురుషోత్తమరావుగారు, P. W. D. శాఖవారు
6. శ్రీ నారాయణ రెడ్డిగారు
7. శ్రీ రాజలింగముగారు, P. W. D. శాఖవారు
8. శ్రీ వెంకటరాజన్న అవధానిగారు, వకీలు
9. శ్రీ వెంకటరావుగారు, పేష్కారు
10. శ్రీ దోంతుల రాజలింగంగారు శాహు
11. శ్రీ యస్. చంద్రయ్యగారు, సత్రేదారు
12. శ్రీ లోకేగారి పెద్దరామన్నగారు
13. శ్రీ లోకేగారి చిన్నరామన్నగారు
14. శ్రీ విఠలరావుగారు, వథోత్ కర్
15. శ్రీ అయిత పోచిరెడ్డిగారు (దామరకుంట)

Copies

*Can be had from*

**S. R. Acharya,**

Teacher, High School

MANTHANY.

Dist—Karimnagar.

Sri Bharathi Power Press, Saunder's Road, Secunderab